ఆంధ్రప్రభ 22-6-1986 (ఆదివారం)

# గాంధీ మహాత్ముడు ప్రశంసించిన వ్యవస్థ

**(1920సం॥ డిశంబరు 8వ తేదీ యంగ్ ఇండియా వ్యాసము)**

"నేను దక్షిణాపథములో పర్యటించినప్పుడు కుల వ్యవస్థను గూర్చి వెల్లడించిన అభిప్రాయాలు కొందరికి రుచింపక నన్ను తిట్టిపోస్తూ లేఖలు వ్రాశారు. ఆగ్రహావేశంతో వ్రాసే లేఖలలో యుక్తాయుక్త వివేచన గాని విషయ చర్చగాని వుండవు. ఈ విషయాన్ని గూర్చి చర్చించడానికి యంగ్ ఇండియా పత్రికలో పూర్తి అవకాశమివ్వదలిచాను.

నాకు లేఖలు వ్రాసిన వారిలో ఇద్దరు, మనదేశ దాస్యానికి మూలకారణం కులవ్యవస్థ యని,ఇది ఇంకా ఇలాగ కొనసాగితే దేశం నాశనమై పోతుందని వ్రాశారు.

మన ప్రస్తుత స్థితికి కారణము కులవ్యవస్థకాదు. అరిషడ్వర్గాలలో ప్రధాన దుర్గుణమైన దురాశ, నీతి ధర్మాల ఉల్లంఘనము అని నా నిశ్చితాభిప్రాయము. నిజానికి హిందూజాతి విచ్ఛిన్నమై పోకుండా కాపాడినది కులవ్యవస్థ యని నా అభిప్రాయము. అయితే తక్కిన అన్ని వ్యవస్థలలోలాగనే దీనిలో కూడా కొన్ని అవలక్షణాలు చేరి దీనిని కలుషితపరచినవి.

చతుర్వర్ణ సంఘవిభజనము ప్రాతిపదికమైనది, సహజమైనది, అవశ్యకమైనది అని నా అభిప్రాయము. కుల వ్యవస్థలో పెరిగిన అసంఖ్యాకమైన చిల్లర కులాలు ఒక్కొక్క సందర్భములో కొంత ఉపయోగకరములుగా నున్నప్పటికీ మొత్తము మీద దేశాభివృద్ధికి ఆటంకములుగానున్నవి. వీనినన్నిటిని అసలు కులాలలో ఎంత త్వరగా కలిపివేస్తే అంతమంచిది. ఎటువంటి అలజడి, చప్పుడు లేకుండా ఈ కార్యము జరుగుతూనే ఉన్నది. ఈ చిల్లర కులాలు వృద్ధిక్షయాలు జరుగుతూ ఉన్నవి. జనసంఘములోనున్న సహజ శక్తుల, ఒత్తిడివల్లను, దేశపరిస్థితులలో కలుగుతూఉన్న మార్పులవల్లను ఈ సమస్య పరిష్కారము కాగలదనే దానికెంత మాత్రము సందేహములేదు.

హిందూమత ధర్మాలకు పునాది యైన చతుర్వర్ణ వ్యవస్థను రద్దు పరచడానికి నేనెంతమాత్రము అంగీకరించను.

కులవ్యవస్థ జనుల అసమానతలపైన ఆధారపడిన వ్యవస్థ అనే మాట నిజంకాదు. కులభేదాలున్నప్పటికీ ఒకరెక్కువ, ఇంకొకరు తక్కువ అనే తారతమ్యము లేదు. అందరూ సమానులే. అందరిలోనూ గల ఆత్మ పరమాత్మ సంబంధమైనదే. తారతమ్యమనేది కేవలము తప్పుడు సిద్ధాంతము. దీనిని అరికట్టడానికి ప్రయత్నించాలి. ఈ పొరబాటు అభిప్రాయములోని లోపాన్ని పురస్కరించుకొని అసలు వ్యవస్థనే రద్దు చేయమని కోరడము తప్పు. కులవ్యవస్థను అవసరమైనవిధముగా సంస్కరించి చక్కబరుచుకోవడానికి వీలున్నది

భారతదేశంలోనే గాక ప్రపంచములోని అన్నిదేశాలలోను నేడు ప్రబలుతూ ఉన్న డెమాక్రసీ-ప్రజాస్వామ్య భావాలవల్ల ఒక వర్గమువారింకొక వర్గము వారి ఆధిపత్యము క్రింద అణగిమణగి యుండే రాజకీయ పాలన, జీవిత విధానము అంతరించి స్వేచ్ఛ స్వాతంత్ర్యము సమాన ప్రతిపత్తి భావములు అభివృద్ధి చెంది తీరతాయి.

ప్రజాస్వామ్య భావమనేది కేవలము మాటలతో గడిచి పోయే విషయము కాదు. పైపైన కనబడే రాజకీయ సాంఘిక వాదికి జీవిత విధానం బహిరంగ స్వభావాలు మాత్రము మార్పుడంద్వారా సరిపుచ్చే యాంత్రిక ఏర్పాటు కాదు. అది హృదయములో పుట్టి త్రికరణశుద్ధిగా ఆచరించవలసిన ఉదారభావము. ఈ భావానికి చతుర్వర్ణ వ్యవస్థ ఆటంకమనుకుంటే భారతదేశములోని జనాభాలో నున్న హిందూ, మహమ్మదీయ, పారసీ, సిక్కు మత వర్గాలు కూడా దీనికి ఆటంకములు చెప్పవలసి వస్తుంది.

ప్రజాస్వామ్య భావము మానవులలోని జాతి,మత,కుల స్త్రీ పురుష భేధాలతో నిమిత్తము లేకుండా అందరూ సోదరులే యనే భ్రాతృభావాన్ని పెంపొందించే దివ్యభావము. ఒక క్రైస్తవుడు గాని మహమ్మదీయుడుగాని నా తోడపుట్టిన వాని వంటివాడేయని భావించడంలో ఏవిధమైన యిబ్బందీ నాకు కనబడడంలేదు.

నిజానికి మన భారతదేశంలో హిందూ మత ధర్మాన్ని స్థాపించిన ప్రాచీన మహాఋషులు కేవలము హిందూమతావలంబులకే గాక సర్వజనులకు శుభము చేకూరాలని మానవులనే గాక సమస్త ప్రాణులను సోదర భావముతో చూడాలని ప్రతిపాదించియున్నారనే సంగతి విస్మరించరాదు.

బ్రాహ్మణుడై పుట్టినవాడు యావజ్జీవము బ్రాహ్మణుడుగానే వున్నందువల్ల కొంత లాభమున్నదని నా అభిప్రాయము. ఆ బ్రాహ్మణుడు బ్రాహ్మణ ధర్మమును ఉల్లంఘించి అక్రమ ప్రవర్తనకు పాల్పడితే అతనికి -నిజమైన బ్రాహ్మణునికి ఉండే గౌరవము మర్యాద వుండదని అందరికి తెలిసిన విషయమే. కులధర్మాలనుల్లంఘించి దుష్కార్యాలు, పాపకృత్యాలు చేసే వారిని విచారించి బహిష్కరించి శిక్షించడానికి, కులభ్రష్టులను చేయడానికి , కులాచారములను యధావిధిగా పాటించువారిని సత్కరించడానికి ఒక ధర్మశాసనము లేక న్యాయ సభను స్థాపించుట సులభమైన కార్యము కాదు.

హిందువులలో అన్ని కులాలవారిలో ఎవరు చేసిన పాపమును వారనుభవిస్తారనే భావము జీర్ణించియున్నది. కర్మ, పునర్జన్మ సిద్ధాంతాలను అందరూ విశ్వసిస్తారు. అందువల్ల ఈ జన్మలో చేసిన పాప ఫలమును మరు జన్మలో తప్పక అనుభవిస్తారని నమ్ముతారు. బ్రాహ్మణ ధర్మమునుల్లంఘించి పాప కృత్యములు చేసిన బ్రాహ్మణునికి ఉత్తర జన్మలో బ్రాహ్మణత్వంపోయి క్రింది కులములోనో అంతకన్న తక్కువ కులములోనో లేదా పాప యోని సంబంధములైన జంతువర్గములోనో జన్మిస్తాడని ఆ వ్యక్తి చేసిన పాపానికి సహజ ప్రకృతివల్లనే న్యాయమైన శిక్ష జరుగుతుందని, యధావిధిగా బ్రాహ్మణ ధర్మము నిర్వర్తించిన బ్రాహ్మణుడు ఉత్తమగతులు పొందుతాడని అన్ని మతాల వారూ నమ్ముతారు. ఈ పాప భీతి మనుష్యులను క్రమశిక్షణలో నుంచుతుంది.

ఒకరి చేతి నీళ్ళు ఇంకొకరు త్రాగడముగాని ఒకరితో కలిసి భోజనము చేయడముగాని వివాహ సంబంధాలు చేయడముగాని ప్రజాస్వామ్య జీవితానుభూతికి ముఖ్యమైన విషయాలు కావని నా అభిప్రాయము. పరిపూర్ణ ప్రజాస్వామ్య విధానాలను ప్రతిబింబించే ఏ రాజ్యాంగమూ ప్రజల సాంఘిక, మత విషయాలలో ఒకే విధమైన సంప్రదాయాలు కలిగి ఉండాలనే నియమ నిబంధనలను శాసించలేదు. (ఇంగ్లండు, అమెరికా దేశాలలోని క్రైస్తవ మత శాఖలవారిలోను యూదు జన వర్గము మొదలైన భిన్న సంప్రదాయాలవారున్నారు).

ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తి చేతి నీళ్ళు త్రాగకపోయినా అతనితో భోజనము చేయకపోయినా వివాహ సంబంధాలు చేయకపోయినా మహా పాపము చేస్తున్నావని నేనంగీకరించను.

హిందువులలో అన్నదమ్ముల పిల్లలు వివాహము చేసుకొనరాదనేది నియమము. మహమ్మదీయులలో లేదు. ఈ నిషేధము ఉన్న హిందువుల పిల్లలలో అనురాగము తగ్గిపోయినదా? బహుశా వృద్ధి చెందినదని నా నమ్మకము. వైష్ణవ సంప్రదాయమునకు చెందిన కుటుంబాలలో ముఖ్యముగా గుజరాతీ వైశ్య కుటుంబాలలో తల్లి తన బిడ్డలతో కలిసి భోజనము చేయదు. వీరుపయోగించిన పాన పాత్రలు కడిగి శుద్ధి చేసిగాని ఉపయోగింపదు. అంతమాత్రాన ఆ తల్లికా బిడ్డలపైన ప్రేమ లేదనిగాని ఆమెకు స్వాతిశయమున్నదని గాని అనడానికి వీలున్నదా? వారిని తక్కువగా చూస్తున్నదని చెప్పవచ్చునా? ఈ నియమాలు నియమ నిబంధనలూ స్త్రీ పురుషుల జీవితాలను క్రమబద్ధం చేయడానికే ఉండినవేగాని మరేమీ కాదు.

కాలము గడిచిన కొద్దీ ప్రజావసరాలను బట్టి దేశ పరిస్థితులలో కలిగే మార్పులనుబట్టి సందర్భానుసారముగా ఈ ఆచారాలను, నియమాలను క్రమక్రమంగా నెమ్మదిగా మార్చుకొనవచ్చును. లేదా అవి వాటి యంతట అవే మారవచ్చును.

చతుర్వర్ణ వ్యవస్థను నేను సమర్థిస్తున్న వ్యక్తినే. మన కులాలవారు పాటిస్తూవున్న అస్పృశ్యతా దురాచారమును మాత్రము నేను సహించలేను. ఇది మానవత్వానికే విరుద్ధమైన దురాచారము. బలవంతులు బలహీనుల పట్ల చేసే అన్యాయమైన అపచారము అని నా అభిప్రాయము. ఇది స్వాతిశయ భావాల వల్లనే పుట్టి పెరిగినది. సంఘములోని వారనుభవించే సామాన్య సౌకర్యాలు కూడా వీరికి లేకుండా చేశాము. ఇది కొనసాగుటకు ఏ విధమైన కారణాలు లేవు. సర్వజనుల శ్రేయో ప్రేయాలను కోరుతూ అందరూ సుఖముగా జీవించాలని ప్రతిపాదించిన సనాతన ధర్మము నేడు విరుద్ధమైనది. హిందూ ధర్మాలనే శిరసావహించు అసంఖ్యాకమైన అమాయక వర్గమువారిని అధోగతిలో అణచివుంచి ఘోరమైన శాపానికి ఒడికట్టినామని నా అభిప్రాయము. ఈ దీనజనులు మనబోటివారికన్న ఏ విధముగాను తక్కువైనవారు కాదు. ఇంతేగాక వీరు దేశానికి తక్కిన జన సంఘానికి అత్యంతావశ్యకమైన అనేకోపయుక్త సేవలను చేసేవారైయున్నారు.

ఈ అన్యాయపు దురాచారమును మన మత ధర్మాలకు పునాదియైన వేదములు శాసించలేదు. దేశములో ధర్మచ్యుతి కలిగి అన్యాయాలు ప్రబలిన కాలములో పెచ్చు పెరిగి ఉంటుంది. దీనినేకాలములోను సమర్థించడానికి అవకాశము లేదు. దీనిని సమర్థించువారెవరైనా వారు మూల శాస్త్రాల నుండి విధి నిషేధాలేమైనా చూపినా అవి చెల్లవు. న్యాయ ధర్మాలకు బుద్ధికి అంతరాత్మకు విరుద్ధమైన అన్యాయ దురాచారమునంత త్వరగా నిర్మూలిస్తే అంతమంచిది.

-దిగవల్లి వేంకటశివరావు